# వీర బొబ్బిలి




కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్
గ్రంథ ప్రకాశకులు : : రాజమహేంద్రవరము.

# వీర బొబ్బిలి

బుర్ర కథ

ర చ యి త

శ్రీ దంటు కృష్ణమూర్తి


ప్ర కా శ కు లు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్

సంస్కృతాంధ్ర బుక్ డిపో (స్థా. 1882) రాజమండ్రి.

# వీర బొబ్బిలి

జయము జయము మన తెలుగు తల్లికి

జయము దిగ్విజయము

జయము జయము మన వీరనారికి

జయము దిగ్విజయము

హాస్యం : ఆగరా భాయీ ! యీ జేజేలకేం గాని యీవాళ కాలక్షేపం యేమిట్రా ?

కధ : ఈవాళ కాలక్షేపమా ! తెలుగు ఖండపు ప్రసిద్ధగాధ వీరబొబ్బిలి. అట్టే గొడవచేయక శ్రద్ధగావిను.

హాస్యం : వీరబొబ్బిలే ! కానీయండి.

వినరా ఆంధ్రుడ బొబ్బిలి యుద్ధపు

వీరగాధ నేడు

భారతఖండమె పులకించును యీ

చరితము వింటేను

మనరాష్ట్రంబున విజయనగరమను

పట్టణ రాజ్యమును

రామరాజు పాలించెడివాడు

రాజతీవి యలర

బొబ్బిలి సీమను యేలేవాడు
ప్రభువు రంగరావు
ప్రభువులిద్దరూ పౌరుషమ్ములో
బెబ్బులు లేనయ్యా
రంగారాయని తమ్ముడు గలడు
వెంగళరాయుండు
కార్యశూరుడుగ ఆతడెంతయో
ఖ్యాతినందినాడు
వానికి పాపారాయుండనెడి
బావమరది గలడు
అతనిశౌర్యమును వర్ణించుటకు
అలవికాదు బాబూ
పంచాననమే పరుగులెత్తును
వాని పేరువిన్న
వారికి తోడుగ నుండెడివాడు
ధర్మారాయుండు
ప్రభువుగారికి ధర్మారాయుడు
బావమరది యేను

కథ : ఈ విధంగా బొబ్బిలికోటను రంగారావుగారు ప్రతిభాశాలురైన తన బంధువుల సహాయ సహకారాలతో చక్కగా పరిపాలిస్తుండగా ఒకసారి విజయనగరాన్ని పరి

పాలించే విజయరామరాజుకు కోడిపందెము లాడాలని మనస్సు కలిగింది. వెంటనే అతడు తన కోరికను దగ్గరున్న తన పరివారానికి తెలియచేసి "నాతో సమానంగా కోడిపందాలు ఆడగలవారెవరైనా వున్నారా ?" అని ప్రశ్నించాడు. అపుడక్కడేవున్న ఆనందరాజు బొబ్బిలిలోవున్న వెంగళ రాయుని పేరుచెప్పాడు. తక్షణం విజయరామరాజు వెంగళ రాయుని పేర ఒకజాబు వ్రాసి నౌకర్ల చేత బొబ్బిలికి పంపించాడు. అందులో యేమని వ్రాశాడయ్యా అంటే.

హాస్యం : అంటే ! తొందరగా చెప్పవోయ్.

వినవయ్యా ఓ వెంగళరాయా

తందాన తందాని తందన

చిన్న మనవినే చిత్తగించుము ॥తం॥
కోడిపందెముల మీతోనాడగ ॥తం॥
ఇప్పుడునాకూ యిచ్ఛగలైను ॥తం॥
చుట్టుప్రక్కల మేలుకోళ్లతో ॥తం॥
మీరుతప్పక యీ గురువారం ॥తం॥
మన్నెంమీదకు రాగోర్తాను ॥తం॥
నేనూసరిగా అన్లే సిద్ధము ॥తం॥
ఇందుకు నీవు సంశయించకు ॥తం॥
యెవరు గెలిచితే వారిదెకీర్తి ॥తం॥
అంగీకారం తప్పక పంపుము ॥తం॥

కథ : ఈ జాబును రంగారావు, వెంగళ రాయుడు గార్లు చూసి నవ్వుకుని తమ ఆమోదాన్ని మళ్లా విజయ రామరాజుకు తెలియపరచారు. సరే. పందెం ఖాయంకాగానే అటు విజయనగరం ప్రభువూ, యిటు బొబ్బిలి ప్రభువూ కూడా మంచిమంచి కోళ్లను తీసుకురమ్మని తమతమ సంస్థానంలోని అన్నిప్రాంతాల అధికారులకూ వుత్తర్వులు పంపించారు. ఆ ప్రకారంగానే రెండు పక్షాలవారికీ అద్భుత మైన కోళ్లు లభించాయి. గురువారం నాటికి ముందుగానే మన్నెంమీద విడిదిలూ, కోళ్లకు చల్లని పందిళ్లు వేయించ బడ్డాయి. తన పరివారంతో సహా విజయరామరాజు గురువారం ఉదయానికే అక్కడకు చేరుకున్నాడు. రంగారావుకూడా వెంగళరాయుడూ, పాపారాయుడూ, మొదలైన పరాక్రమ శాలురంతా వెంటరాగా సపరివార సమేతుడై మన్నెంమీదకు చేరుకున్నాడు. అక్కడ విజయ నగర, బొబ్బిలి పాలకులు ఒకరినొకరు కౌగలించుకుని కుశల ప్రశ్నలు వేసుకున్న తర్వాత విజయరామరాజు రంగారావు గారితో కూడావున్న వెలమదొరలంతా వారి కోళ్ళను ముందుగా పందానికి వదలిపెట్టమన్నాడు. రెండు సంస్థానాల ప్రభువులూ కుర్చీలలో ఆసీనులై వుండగా సేవకులు పందెం ప్రారంభించారు. ముందుగానే కోళ్లుఅన్నీ ఆకర్షవంతంగా

అలంకరించబడ్డాయి. కత్తులు కట్టబడ్డాయి. పందెం యెలా జరిగిందయ్యా!

హాస్యం : యెలా జరిగింది ?

వెలమదొరలు తమ కోడిపుంజును
తందాన తందాని తందన
ప్రప్రథమంగా విడిచిపెట్టిరి ॥తం॥
అప్పుడు కోళ్లు కొక్కరించెను ॥తం॥
ఆవేశంతో బొబ్బిలికోడి ॥తం॥
యోజనదూరం గప్పున యెగిరి ॥తం॥
విజయనగరపు పుంజునెత్తిపై ॥తం॥
ఒక్కపోటునే పొడిచిందండీ ॥తం॥
దెబ్బ తట్టుకోలేక గిరగిర ॥తం॥
తిరిగిచచ్చె నా రాజుల కోడి ॥తం॥
కొక్కరో మని బొబ్బిలికోడి ॥తం॥
కూతవేసియే ఛెంగు ఛెంగున ॥తం॥
విజయనగరపు కోళ్ల గుంపుపై ॥తం॥
దూకిచంపినది యెన్నో కోళ్లను ॥తం॥

కథ : ఇలా బొబ్బిలిపుంజు స్వైర విహారం చేసి లెక్కలేనన్ని కోళ్లను చంపడమే కాకుండా యింకా యెన్నో కోళ్లకు గాయాలు కలిగించింది. మొదటిసారి పందెం యిలా

అవగానే రెండవసారి విజయరామరాజు తన పుంజును విడచి పెట్టాడు.

విజయనగరపు కోడి విహారం

తందాన తందాని తందన

చూసి బొబ్బిలి బారాకోడి ||తం||

యెక్కడలేని కోపముతోడ ||తం||

ఆకలిగొన్న సింహంతీరున ||తం||

మళ్ళా విజృంభించి దూకెను ||తం||

తరిమి తరిమి ఆ రాజు కోళ్ళను ||తం||

హతమార్చించి బొబ్బిలిపుంజు ||తం||

అంతట వెంగళ్రాయనితోడ ||తం||

విడిపిద్దామా కోళ్ళనంచును ||తం||

విజయ రామరాజన్నాడయ్యా ||తం||

మంచిదనియె నా వెంగళ్రాయుడు ||తం||

హాస్యం : అయితే విజయరామరాజు ఓడిపోయాటన్న మాట.

కథ : ఆం. అయితే అంతటితో ఆగలేదు. మళ్ళా మంచి కోళ్లను దింపించమని సేవకులకు ఆజ్ఞాపించాడు. ఆ ప్రకారంగావాడు వున్నవాటిలో మేలురకం కోళ్లను దింపారు. వెంగళరాయుడు మామూలుగా తన బారాకోడిని

విడిచిపెట్టాను. ఈసారికూడా రాయుడిపుంజుదే పై చెయ్యి అయింది. దానితో విజయరామరాజుకు బొబ్బిలివారి పై పట్టరాని ఆగ్రహం వచ్చింది. అంతట :

వైరికోపమున గుడ్లుపెంచి యా
విజయరామరాజు ||వీ||
కోళ్లను దింపగ పరివారాన్నే
కోరినాడు బాబూ ||వీ||
మరియొక పుంజును సేవకులప్పుడు
యేరి తెచ్చినారు ||వీ||
వీరకిశోరం పాపారాయుడు
వెంటనె అన్నాడు ||వీ||
నాదు పేరుతో యీ పర్యాయం
పందెం వేస్తాను ||వీ||
సరియేనంటూ వెంగళ్రాయుడు
సమ్మతించినాడు ||వీ||
బొబ్బిలి కీర్తిని నిలుపుమంచును
పుంజును సవరించి ||వీ||
వదలినాడయా రాజుపుంజు పై
పాపారాయుండు ||వీ||
అప్పుడు కూడా ఒక్కక్షణములో
బొబ్బిలి గెలిచింది ||వీ||

కథ : ఈరీతిగా అన్నిసారులూ బొబ్బిలివారికే విజయం సిద్ధించడంతో విజయరామరాజుకు తీరని ఉక్రోషం కలిగి వెంటనే బయలుదేరి విజయనగరం వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయినవాడు వూరుకున్నాడా అంటే, లేదు. ఒక్క దెబ్బలో బొబ్బిలి అంతు కనుక్కోవాలని పగపట్టి అందు కోసం ఆలోచనలు సాగించ నారంభించాడు. మామూలుగా బొబ్బిలిదొరలు కూడా తమ స్వస్థానానికి వెళ్ళిపోయారు. ఇలా కొంతకాలం గడచిన తర్వాత ఫ్రెంచి గవర్నరయిన బుస్సీదొర తన మంత్రి హైదరుజంగుతో కలసి గోల్కొండ నుంచి తూర్పుదేశం చూడడానికి బయలుదేరి వచ్చాడు. అతనితో కావలసినంత పరివారమూ, మందుగుండు సామానూకూడా వున్నాయి. బందరులో బుస్సీకి లక్ష్మన్న అనే దుబాసీవున్నాడు. అతడు బుస్సీ తూర్పు దేశయాత్రకు ఏర్పాట్లు చేశాడు. వారు దేశంలోని వివిధ ప్రదేశాలు చూస్తూ నల్ల చెరువులో మజిలీచేసినప్పుడు బుస్సీదొర లక్ష్మన్నతో తన రాక విషయం విజయనగర మహారాజయిన విజయరామరాజుకు తెలియ చేయమన్నాడు. లక్ష్మన్న ఆ ప్రకారం రామరాజుకు వుత్తరం వ్రాస్తూ వెంటనే ఆయనను యెదురువచ్చి బుస్సీకి స్వాగతమిమ్మని కోరాడు. అలాగే బొబ్బిలి దొరగారికికూడా మరొక జాబు వ్రాసి పంపాడు.

సరే. అటు విజయనగరం వారికీ, యిటు బొబ్బిలి వారికీ గూడా లక్ష్మన్న జాబులు అందాయి. బొబ్బిలి దొర రంగారావుగారు తన జాబుకు యేసమాధానమూ యీయకుండా వూరుకున్నాడు. పోతే బుస్సీపేరు వినగానే విజయరామరాజుకు మాత్రం గుండెలలో రాయిపడ్డట్లయింది. యేమి చెయ్యాలో తోచక భయంతో వణకిపోయాడు. రెండు రోజులపాటు అదేపనిగా ఆలోచించి తుదకు వెంగళరాయుడు కొక జాబు వ్రాశాడు. ఏమని వ్రాశాడయ్యా.

హాస్యం : ఏమిటయ్యోయ్ ?

పుడుచ్చేరినే యేలేటట్టి తందాన తందాని తందన్న
బుస్సీమనవై పొచ్చినాడయా ||తం||
యెదురు సేవకే రావాలంటూ ||తం||
నాకొకజాబు వచ్చిపడ్డది ||తం||
వానిభాష మనకేమీరాదు ||తం||
మనభాషయితే వానికిరాదు ||తం||
పైగా అతడు పగలూ రాత్రీ ||తం||
త్రాగికైపుతో వుంటాడయ్యా ||తం||
కనకమీరునూ మాతోగూడా ||తం||
రావలసిందని కోరుచుంటిని ||తం||
అక్కడవానితో జగడంవస్తే ||తం||

మనమువానినే తరమవచ్చును ॥తం
కనక వెన్కటి పగలనుమీారు ॥తం॥
మరచి సాయమును చేయగావలె ॥తం॥

కథ : ఈ విధంగా విజయరామరాజు వెంగళ రాయుడుకు వుత్తరం పంపించాడు. ఆ వుత్తరం చూడగానే వెంగళరాయుడేమి చేశాడయ్యా.

విజయనగరపు రాజుజాబుకు
వెంగళరాయుండు ॥వి॥
పకపకనవ్వి దాని తెచ్చిన
బంట్రోతులతోన ॥వి॥
అన్నాడిట్టుల మందలింపుగా
అందరు వినుచుండ ॥వి॥
మీాదు ప్రభువుకూ మూాతినక్కూటా
మీాసమ్ములు లేవా ? ॥వి॥
కోకకట్టుకుని కొప్పుపెట్టుకుని
కోటలోనున్నాడా ? ॥వి॥
తన్నుపిలిచితే బుస్సీ వద్దకు
తానే పోవాలి ॥వి॥
సేవకుమమ్మూ రమ్మని చెప్పట
సిగ్గులేని పనియె ॥వి॥

హాస్యం : హాయి ! హాయి ! ఏమి గొప్పగా బుద్ధి చెప్పావురా.

కథ : ఆగరా ! అంతటితో అయిపోలేదు.

హాస్యం : ఊఁ. ఇంకా యేమిచేశాడ్రా ?

కథ : కోపంతో బంట్రోతుల మెడుకే యిలా వాళ్ల రాజును నానాచీవాట్లూ పెట్టి అతడు పంపిన జాబును ముక్కలుగా చింపి తగలబెట్టించి ఆ బంట్రోతుల్ని మెడలు పట్టి బయటకు గెంటించేశాడు. వాళ్లు గోలపెడుతూ విజయ రామరాజు వద్దకు పోయి జరిగినదంతా విన్నవించు కున్నారు.

పద్యం. అంత కోపాన రాజిట్టులనియె, నేమి ?
నెర్రివేషాలు వేసెనా వెంగళీండు
బొబ్బిలిని క్షణములో నింకపూడ్చి నాదు
శక్తి చూపెద పూర్తిగా జడమతులకు.

కథ : ఇలాపగబట్టి తన చేతికిందనున్న లక్షా తొంభై వేల దండునూ రమ్మని ఆజ్ఞాపించి తాను లెక్కలేనంతగా వెండిబంగారాలు తీసుకుని బుస్సీవద్దకు వెళ్లాడు. ఆ కానుక లన్నీ బుస్సీకి సమర్పించడంతో అతడు పొంగిపోయాడు. తిరిగి నీకేమికావాలని విజయరామరాజును ప్రశ్నించాడు. అపుడు విజయరామరాజు తనకు బుస్సీ అనుగ్రహం తప్ప మరేమీ అక్కర లేదంటూనే ఒక కోరికకోరాడు. అదేమిటయ్యా.

హాస్యం : యేదో పెద్ద కోరికలాగే వుందేమిటిరోయ్. ఏది చెప్పు ?

బొబ్బిలికోటను పాలించేటి

తందాన తందాని తందన

వెలమదొరలకు క్రొవ్వు హెచ్చెను ||తం||

సుత్తుత్తో వారు మసలుచుండిరి ||తం||

గాన బొబ్బిలి ఫర్మానాలు ||తం||

తప్పకనాకు యిప్పించండి ||తం||

హాస్యం : ఆరి వీడితస్సదియ్యా. ఎంత యెత్తువేశాడు ? అప్పుడు బూచీ యేంచేశాడురా ?

కథ : బూచీ కాదురా, బుస్సీ.

హాస్యం : ఆఁ. వాడే వాడే. ఏంచేశాడు ?

కథ : మొదట విజయరామరాజు యిలాం అడిగేసరికి అతడు నోరుమెదపకుండా కూర్చున్నాడు. కొంచెం సేపు విజయరామరాజు దొరగారి మొఖంకేసి తేరపారచూసి తర్వాత ఆయనముందు రెండు వేల వరహాలు గుమ్మరించాడు,

హాస్యం : ఆ. ఆ. లంచమే.

కథ : అవును, ఆ రెండు వేల వరహాలు చూడగానే బుస్సీగారి కళ్లుకుట్టి వెంటనే బొబ్బిలికోట ఫర్మానాలు విజయరామరాజుపేర వ్రాసి యిచ్చేశాడు. తక్షణం బుస్సీ

దొర, విజయరామరాజుగార్లు తమతమ సిబ్బందితో బొబ్బిలికి ప్రయాణమయ్యారు. ఈ సంగతి రంగారావుగారికి తెల్సి వెంటనే పాపారాయుడ్ని రాజాంకు పంపించాడు. నోచ్చుతగ్గులేవైనా వస్తే బుస్సీని చిత్తుచేసి తిరుగువేయమని చెప్పి మరీ పంపించాడు. అయితే రాజాంలో పాపారాయు డున్నాడన్న సంగతి ముందుగా విజయరామరాజుకు తెల్సింది. ఆ దారిని వెడితే తమ ప్రాణాలు దక్కవన్న భయంతో పక్కదారిని పట్టి అడవులంట ప్రయాణమయ్యారు. కాని రంగారావు అడవిబాటలోకూడా ఆరితేరిన పన్నెండుమంది తెలగవీరుల్ని కాపుంచాడు, వీరు అర్ధరాత్రి సమయంలో బుస్సీ పటాలాన్ని యెదుర్కొన్నారు. కాని బుస్సీ మందు గుండు సహాయమంతా వార్ని హతమార్చి బొబ్బిలికిచేరి పాటిమీద డేరాలు వేయించుకుని మకాం చేశాడు. మర్నాడు పొద్దయం బొబ్బిలికోటకింద నగారా మోగడంతో రంగారావు, వెంగళరాయుడుగార్లు బుస్సీవచ్చాడని తెల్సుకున్నారు. అంతట రంగారావు వెంగళరాయునితో యేమన్నాడంటే.

దొంగత్రోవనే వచ్చెను బుస్సీ
తందాన తందాని తందన
ముప్పిరుంగని బొబ్బిలికిపుడు ॥తం॥
వచ్చిపడినది పెద్దవిపత్తు ॥తం॥



నాసాటిరాయుడు కూడాలేడు ||తం||
కనకయిప్పుడు రాజస్త్రీలనే ||తం||
తీసుకు వలసలు పోవలె మనము ||తం||
ఆపై వెనుకనువచ్చి యుద్ధమే ||తం||
చేద్దామయ్యా వెంగళరాయా ! ||తం||

కథ : రంగారావు యిలా పలికేసరికి వెంగళరాయుడికి పట్టలేని ఆగ్రహం కలిగింది. ఇలాంటి పిరికిమాటలు చెప్ప వద్దని అన్నగార్ని మందలించాడు. తాను వెంటనే కత్తిదూసి యుద్ధానికి సిద్ధమయ్యాడు. అప్పుడు రంగారావు అతనిని శాంత పరచి ముందుగా ధర్మారాయుడ్ని బుస్సీవద్దకు రాయబారం పంపించాడు. ధర్మారాయుడు చాలా చాకచక్యంతో రాయబారం సాగించి శాంతంగా పరిస్థితులను చక్కబరచ డానికి తాపత్రయపడ్డాడు.

పద్యం. పగలు గలవయ్య రాజుకు మాకు తొల్లి
వాసి సాధించ నాతడు వక్రబుద్ధి
చెప్పియుండును నీతోడ చెనుగులెన్నొ
గాని మాదార నిజముగ మాన్యుడయ్యా !

ఇలా చెప్పి కావలసినంతడబ్బు, యినాములు యిస్తామన్నాడు. తమపై పగసాధించవద్దని ప్రతిమాలాడు. అప్పుడు బుస్సీ తనను నమ్మి విజయరామరాజు వచ్చాడు కనక అతనికి

ద్రోహంచేయననీ బొబ్బిలి ధర్మాన్నా అతనికి వ్రాసి యిచ్చాననీ అతనితో సంధి చేసుకొమ్మనీ ధర్మారాయుడితో అన్నాడు. దానికి ధర్మారాయుడు ఒప్పుకోలేదు. అయితే అతడు బుస్సీతో తనకూ, విజయరామరాజుకూ యుద్ధం కల్పించి యెవరు గెలిస్తే వారికి కోట నిమ్మన్నాడు. కాని బుస్సీ దాని నంగీకరించక తాను విజయరామరాజుకు పట్టంకట్టి వెళ్లిపోతాననీ తర్వాత వెనకపాటుగావచ్చి వానిని చావగొట్టి కోటను ఆక్రమించుకోనమనీ ధర్మారాయుడికి సలహా యిచ్చాడు. ఆ మాటలు వినగానే ధర్మారాయుడు మండిపడి అక్కడనుంచి లేచి వెళ్లిపోతూండగా.

విజయనగరపు రాజుమాటపై
తందాన తందాని తందన
ధర్మారాయుని బంధించుటకు ॥తం॥
బుస్సీ ఆజ్ఞను యిచ్చాడండీ ॥తం॥
అంతట కలహం చెలరేగింది ॥తం॥
వెలమదొరలలో ముగ్గురువీరులు ॥తం॥
త్రెంచి సైనికుల తుపాకి గుండ్లకు ॥తం॥
ప్రాణమ్ములనే కోల్పోయారు ॥తం॥
పౌరుషమ్ముతో ధర్మారాయుడు ॥తం॥
వేలకొద్దిగా త్రెంచివారిని ॥తం॥
హతమార్చాడు ఆక్షణమందే ॥తం॥

హాస్యం : సెబాష్!

కథ : ఇలా అనుకోకుండా సంభవించిన యుద్ధంలో వేలాది శత్రువుల్ని తన కత్తికి బలిచేసి తిన్నగా రంగారావు దగ్గరకు వచ్చి విషయాలన్నీ వివరించాడు ధర్మారాయుడు. అంతట రంగారావు ఆవేశంతో ధర్మారాయుడ్ని చూసి "చేతకాని పిరికిపందలా వెనకకు తిరిగివచ్చావా? యీ సమయంలో తాండ్రపాపయ్య అక్కడవుంటే ఆక్రమించినవారి తలలు తెగేసి కోటకు కట్టేవాడే. ఛీ! యికనీవు రాజస్త్రీల అంతఃపురానికిపోయి కూర్చో" అన్నాడు. ఆ మాటకు ధర్మారాయుడు చాలా బాధ పడ్డాడు. వెంటనే అతడు తన సోదరిఅయిన మల్లమదేవి దగ్గరకువెళ్లి జరిగిన సంగతి చెప్పాడు. ఆమె ధర్మారాయుడ్ని ఓదార్చి విజయరామ రాజుకు స్వయంగా తానొకవుత్తరం వ్రాసి పంపింది. అందులో యేమున్నదయ్యా?

విజయనగరపురాజా వినుము
తందాన తందాని తందన
నిన్ను అన్నగా నమ్మితి నేను ॥తం॥
విజయనగరమూ బొబ్బిలికోట ॥తం॥
కావడికుండలు కనకను నాదు ॥తం
పసుపుకుంకుమ నిలపగోరెద ॥తం

కథ : పట్టపురాణి అయిన మల్లమదేవి యిలాకోరిన విజయరామరాజు లెక్కచేయలేదు. ఇది యిలావుండగా నాగశేరాయుడు రాజారంలో వున్న పాపారాయుడికి యీ విషయాలన్నీ తెల్పుతూ ఒకవుత్తరం వ్రాశాడు. స్వేచ్ఛగా ఆ వుత్తరాన్ని పంపడానికి వీలులేకుండా గ్రహించివారి పారా హుండాలవల్ల యిద్దరు భటులకు స్త్రీవేషాలు వేయించి పాలమ్ముకునేవారిగా మార్చి వారి ద్వారా పంపించాడు. అయితే వాళ్లు శత్రువులచేతిలో చిక్కిపోయారు. ఆ జాబు చూడగానే పాపారాయుడింకా బొబ్బిలికి రాలేదన్న సంగతి తెల్సుకుని విజయరామరాజు బుస్సీని పురికొల్పినాడు. పాపారాయుడంటే అంత భయమెందుకనీ అతడెవరనీ అడిగాడు బుస్సీ. దానికి విజయరామరాజు యిలా అన్నాడు.

పద్యం. బొబ్బిలిలోనుండు బెబ్బులి పాపయ్య
యెదురులేనిది వాని పదునుకత్తి
పసిపాపసైతము పాలుత్రాగడు తాండ్ర
సింహమ్ము పేరును చెప్పగానె
ప్రభుభక్తిలోగూడ ప్రఖ్యాత పురుషుడు
ప్రజలకెల్లను ప్రేమ పాత్రుడతడు
కలహమ్ములోవాని కత్తికి నెత్తురు
కాలువలై నేలకార గలదు

అట్టి బెబ్బులి లేదిప్పుడు కోటలోన
గాన తప్పక వెంటనే కదలి మనము
శత్రువుల నెల్లరను గూడ చంపవలయు
లేనిచో మనకు విజయమ్ము లేదు నిజము.

బుస్సీసేనలు దొంగచాటు గా
బొబ్బిలిపై దూకి ||వి||
పాడిపంటలను కొల్లగొట్టుట
ప్రారంభించాయి ||వి||
ఆవులు, దూడలు వేలసంఖ్యలో
హత్యచేయబడియె ||వి||
మొట్టమొదటగా వారుదూకిరి
తట్టుకోటపై కి ||వి||
పటాలరాముడు ప్రతిభాశాలి
కోటలోనున్నాడు ||వి||
వెలమవీరులు యాభై ముగ్గురు
వెంటనే యున్నారు ||వి||
యీటెలతోనూ, కత్తులతోనూ
యెగిరి పడిరివారు ||వి||
శత్రుమూక ఆధీరుల ధాటికి
జడిసిపోయెనండీ ||వి||

పటాలరాముని క త్తికెందరో
బలియైపోయారు ॥వి॥
పచ్చినెత్తురే వీథులలోన
పారసాగెనండీ ॥వి॥
వెలమసింహముల బలమును చూసి
వెంటనే ఆ బుస్సీ ॥వి॥
మందుగుండునే కాల్పించాడు
మారుమాట లేక ॥వి॥
వెలమవీరులు వెళ్లిపోయిరి
వీరస్వర్గమునకు ॥వి॥
పటాలరాముండప్పుడు చాలా
బాధనందినాడు ॥వి॥
ఫ్రెంచివారల చేత చచ్చుట
నీచమంచు తలచి ॥వి॥
ఆతడెబాకుతో రొమ్ము పొడుచుకు
అ స్తమించినాడు ॥వి॥
అంతట సేనలు తట్టుకోటనే
ఆక్రమించినాయి ॥వి॥
విజయనగరపు జెండా అక్కడ
వెలసినాది బాబూ ॥వి॥

హాస్యం : అరెరె. పాపిష్టి తగవు యెంతపని చేసిందిరా. తర్వాత ఏం జరిగింది ?

కథ : తట్టుకోట స్వాధీనం కాగానే ఫ్రెంచి సైనికులు పుట్టకోటపై బడ్డారు. అందులో అంతా స్త్రీలేవున్నారు. ఫ్రెంచి సైనికులు దయా దాక్షిణ్యం లేకుండా స్త్రీలపై తిరగబడి యుద్ధం ప్రారంభించారు. అయితే :

బొబ్బిలిలోగల ఆడువారలు
అబలలు కారండీ ॥వి॥
నడుముబిగించి శత్రుసేనపై
పడిరివారలంతా ॥వి॥
కసితో కొందరు స్త్రీలురాళ్లనే
విసరినారు బాబూ ॥వి॥
యింకా కొందరు చెంబులు ముంతలు
యెగర గొట్టినారు ॥వి॥
పదునుకత్తుల శత్రుశిరములూ
పరపర కోశారూ ॥వి॥
బొబ్బిలి స్త్రీలతో తనదు వీరులు
పోరలేరటంచు ॥వి॥
మందులుగుండు నే బుస్సీగారు
ప్రయోగించినాడు ॥వి॥
ఆమంటలకే అబలలందరూ
ఆహుతియైనారు ॥వి॥

పాలు త్రాగెడి పాపలు సహితం
బలిఅయి పోయారు ॥వి॥

హాస్యం : అబ్బబ్బ. పసిపాపలతో సహా అంతమంది స్త్రీలను చంపడానికి ఆ పాడుబుస్సీకి చేతులెలా వచ్చాయిరా!

కథ : పుట్టకోటలోని స్త్రీలందరూ ఆహుతి అయి పోగానే అక్కడ విజయనగరపు జెండా ప్రతిష్ఠించబడింది. అటుపైనవారు మూలబురుజుపై విరుచుకు పడ్డారు. అక్కడ మహావీరుడు ముత్యాల పాపయ్య వున్నాడు. అతడు తన పరివారంతో కలసి శత్రుసేనతో హోరా హోరీని పోరాటం సాగించాడు. అతనిని గెలవడంకూడా సాధ్యంకాదన్న నిశ్చయంతో ఫ్రెంచివారు మళ్లా మందుగుండు సామాను ప్రయోగించారు. ఒక్క పాపయ్యమాత్రం యెలాగో తప్పించుకు బయట పడ్డాడుగాని తక్కినవారంతా మందు గుండు మంటలకు బలిఅయిపోయారు. పాపయ్య ఒక్కడూ శత్రువులతో యుద్ధం సాగించి వందలాది సైనికుల్ని హతమార్చాడు. వారు అతనిని తుపాకులతో కాల్చ నారంభించారు. పాపయ్య ఒంటినిండా లెక్కలేనన్ని గాయాలు తగిలాయి. రక్తం కాలవలా ప్రవహించ సాగింది. ఇక యెలాగా శత్రువుల చేతిలో తనకు చావుతప్పదని నిర్ణయించుకున్న పాపయ్య వారి చేతిలో మరణించడం

యిష్టం లేక తనంతటతానే బాకుతో పొడుచుకుని మరణించాడు. అక్కడ కూడా విజయరామరాజు యొక్క జెండా నెలకొల్పబడింది. తర్వాత వారు బొబ్బిలికోటపై దండయాత్ర ప్రారంభించారు. అక్కడ :

వెలమవీరుల సాయముతోడ
వెంగళరాయుండు ॥వి॥
శత్రుమూకను చాలావరకూ
సంహరించినాడు ॥వి॥
సింహాంతీరున నాల్గువైపులా
చెరగివేసి యతడు ॥వి॥
తెట్టుకోటనూ, మూలబురుజునూ
పుట్టకోటగూడ ॥వి॥
వశపరచుకున్న ఫ్రెంచివారిని
వణకించాడండీ ॥వి॥
అటుపై రాజును, బుస్సీదొరను
పట్టుకొనుట కొరకు ॥వి॥
వెళ్లాడండీ ఆవేశంతో
వెంగళరాయుండు ॥వి॥
వారలిద్దరూ అంతకుముందే
పరారి అయ్యారు ॥వి॥

ఇదియిట్లుండగ ్రఘేంచివారలు
మందుపేల్చినారు ॥వి॥
మలమలమాడి మరణించారు
వెలమదొరలు అపుడు ॥వి॥
వీపునతగిలిన తుపాకిదెబ్బకు
వెంగళరాయుండు ॥వి॥
రక్తముగ్రక్కుచు నేలమీదనే
రాలిపోయినాడు ॥వి ॥

హాస్యం : ఎంతమంది వీరులు చచ్చిపోయార్రా.

కథ : తమ్ముడు మరణించాడన్న వార్త తెలియగానే రంగారావు యెంతో దుఃఖించాడు. ఇకపోతే ఆయన భార్య మల్లమదేవి యీ సంగతి తెలియగానే యేమిచేసిందయ్యా :

పన్నెండు నెలల ప్రాయముగల్గిన
తందాన తందాని తందన
తనకుమారుడే వెంకట్రాయుని ॥తం॥
ఆఖరుసారిగ ముద్దుపెట్టుకొని ॥తం॥
మారువేషమే వానికివేసి ॥తం॥
దివానమ్మలో పెద్దదియైన ॥తం॥
వెంకటలక్ష్మి చేతనుబెట్టి ॥తం॥
పాపారాయని కప్పగించమని ॥తం॥
ప్రార్థించినది కన్నీరొలుకగ ॥తం॥

ఇలా వెంకటలక్ష్మి చేతిలో ఆ పసిబిడ్డను పెడుతూ పొంగి వచ్చే దుఃఖాన్ని ఆపుకోనలేక మల్లమదేవి యిలా విలపించింది.

పద్యం. "నా జీవనాధార నా మేరు సమధీర
నవమన్మధాకార నా కుమార
నా గుణంబుల ప్రోడ నా వెన్నెల తేట
నాముద్దు పుత్రుడా నాకు నీడ
నాభాగ్యములపంట నానుముద్దులమూట
నానలపులజంట నాదుదంట
నా వెన్నిధానమా నాకులదీపమా
నాదుమూాల ధనమ్మ నాదు తండ్రి
నాదు సుందరాకారి నావిచార
నాదు ఘనపుణ్యముల క్రోవ నాదు తేవ
కావగా జాలడయ్యేను కరుణాబూని
అక్కటా రమానాయకుండా శ్రీహరుడు"

కథ : వెంకటలక్ష్మమ్మ సరేనని తానొక ముష్టిదాని వేషం వేసుకుని ఆ పిల్లవాడిని యెత్తుకుని యింటింటా బిచ్చ మెత్తుకుంటూ బయలు దేరింది. అయితే విజయరామరాజు ఆ కుర్రవానిని గుర్తుపట్టి వారిద్దరినీ బుస్సీదొరముందు పెట్టాడు. ఆ కుర్రవాడు రంగారావు కుమారుడని శత్రుశేషం వుండరాదు

కనక వానిని హతమార్చాలనీ అన్నాడు. కాని పసికందుని చంపడానికి బుస్సీ ఒప్పుకోలేదు. అదీగాక ఆ నెత్తురు కందువల్ల జరిగే అపకారమేమిటో వుండదన్నాడు. అప్పుడు విజయరామ రాజు బుస్సీతో పసిపిల్లలైనా బొబ్బిలివారి పౌరుషమంతా ఒక టేనసీ కావలిస్తే పరీక్ష చేయమనీ అన్నాడు. వెంటనే బుస్సీదొర ఒకచోటపండ్లు, మరొకచోటడబ్బు, వేరొకచోట చంద్రాయుధమూ పెట్టి నీకేదికావాలో తీసుకోమ్మని ఆ బాలుడిని వదిలిపెట్టాడు. అంతట :

పద్యం. పరుగు పరుగునబోయి యా బాలకుండు
తడబడకచేత చంద్రాయుధమ్ము పట్టి
పులికిపుట్టున వన్నియు పులులే గాని
పిల్లి పిల్లలు గానని వెల్లడించె.

కథ : దానితో బుస్సీకి బొబ్బిలివారిపట్ల అభిమానమూ విజయరామరాజుపట్ల అసహ్యత కలిగాయి. ఇలాంటి పౌరుష వంతమైన వంశాన్ని కూలద్రోస్తున్నందుకు అతడు విజయ రామరాజును నానాతిట్లూ తిట్టి పిల్లవానినీ, వెంకటలక్ష్మినీ విడిచిపెట్టాడు. ఆమె పిల్లవాడిని తీసుకుని పాపారాయుడివద్దకు వెళ్లిపోయింది.

ఇక కోటలో రంగారావుగారు తనసేనాని అయిన నర్సారాయుడిని పిలిచి అంతఃపురస్త్రీలు శత్రువుల చేతిలో

పడి చావకుండా ముందుగానే వారినందరినీ స్వర్గానికి పంపించ మని తన పటాకత్తియిచ్చాడు. ఆ మాటలు వినగానే నర్సారాయుడి గుండె తరుక్కుపోయింది. కాని పాపం ఆ స్థితిలో యేంచేస్తాడు? కత్తితీసుకుని అంతఃపురానికి వెళ్లాడు. అక్కడ అమాయకంగా నిద్రిస్తున్న వనితల్ని చూడగానే అతని గుండె చెరువైపోయింది. తనలోతనే యిలావిచారించాడు.

పద్యం. "రణమున నాతురుష్కులను రాజితశౌర్యముచే
వధించి వే
గ మె చనుదెంచి మమ్ములను కౌగిట జేర్చెద
రంచు గోర్కెతో
మనమున సంతసింపుచును భర్తలరాకకు
వేచియున్న యీ
వనితల నెట్లు చంపగల భావములో
దయబూన నక్కటా"

యిలా పరితపిస్తునే అతడు వారి చెంతకు వెళ్లాడు. ముందుగా రాణీ మల్లమదేవి అతడ్ని చూసి విషయం గ్రహించింది. తన భర్త కత్తి అతనిచేతిలో వుండడంకూడా చూసింది. అప్పుడామె అతనితో ధైర్యంగా పనిపూర్తి చెయ్యమని చెప్పి తన మెడవంచుకున్నది. అంతట :

అయ్యొయ్యో అదియేమి పాపము
తందాన తందాని తందన
ఒక్క దెబ్బతో నర్సారాయుడు ||తం||
మల్లమదేవిని కడతేర్చాడు ||తం||
ఆపై తక్కిన స్త్రీల గొంతులే ||తం||
పర పర పరసుని కోసినాడయా ||తం||
అయితే ధర్మారాయుని భార్య ||తం||
గర్భము దాల్చుటచేత ఆమెను ||తం||
చంపనాతడు జంకాడండీ ||తం||
దానినిచూసి ఆమె బాకుతో ||తం||
తానే పొడుచుకు మరణించింది ||తం||

హాస్యం : అబ్బబ్బ! యేమి ఘోరంగా. ఇవి వినడానికే యింత బాధగా వుంటే అనుభవించిన వారెలా బాధపడ్డారో!

కథ : అప్పుడు ధర్మారాయుడు చనిపోయిన తనభార్య గర్భాన్నిచీల్చి అందులోవున్న నెత్తురుముద్దను బయటకుతీసి మెత్తిపారవేశాడు. ఈ విధంగా అంతఃపుర స్త్రీలనందర్నీ హతమార్చి నర్సారాయుడూ, ధర్మారాయుడూ సంగారాయు దగ్గరకు వచ్చారు. పోతేయిక వెలమవీరులంతాకూడా తాము తమ భార్యలనూ, పిల్లలనూ శత్రువులచేతులలో చిక్కకుండా

ముందుగానే తెగనరికి బంధాలన్ని సడలించుకున్నారు. ఇలా క్షణంలో బొబ్బిలి యావత్తూ శ్మశానవాటికగా మారిపోయింది. ఆ పిమ్మట రంగారావు వెండిబంగారాలను అన్నిటినీ యినపపెట్టెలలో పెట్టి బావిలోకి దింపించివేశాడు. తర్వాత యిక తనకూ కోటకూ రుణం చెల్లిపోయిందని తీర్మానించుకుని యుద్ధానికి బయలుదేరాడు. అతనితో 'ధర్మారాయుడూ, నర్సారాయుడూ యితర వెలమవీరులూ కూడా బయలుదేరారు. ముందుగానే యీ సంగతి బుస్సీకి తెల్సింది. దుర్మార్గుడైన విజయరామరాజు మాటలువిని బొబ్బిలి దొరలకు తానింత అపచారం చేసినందుకు అతడు చాలా నొచ్చుకున్నాడు. అంతే కాకుండా అతడు తన పరివారాన్ని రంగారావుకు యెదురుగా పంపించి బొబ్బిలి కోటను మామూలుగా యేలుకొమ్మని కబురంపాడు. దానికి రంగారావు యేమన్నాడంటే :

చాలు చాలు మీ ఆదరణమ్మ

తందాన తందాని తందన

మెంములకొచ్చిన మాటలివన్ని ॥తం॥

అన్నదమ్ములు అంతా చచ్చిరి ॥తం॥

ఆడువారలే అస్తమించిరి ॥తం॥

వేలాది ప్రజలు వెళ్లిపోయిరి ॥తం॥

నాకొక్కడికీ కోటలెందుకు ||తం||
యుద్ధమందున పగసాధించగ ||తం||
నేవచ్చితిని నిశ్చయమ్ముగ ||తం||

హాస్యం : భేష్ ! గొప్పగా బుద్ధిచెప్పాను.

కథ : ఈ విధంగా బుస్సీమనుష్యులకు బుద్ధిచెప్పి రంగారావు విజయరామరాజునూ బుస్సీనీ పట్టుకోనడానికి వెళ్ళాడు. కాని అప్పటికప్పుడే ఆ యిద్దరూ పారిపోయారు. సరే రంగారాయుడు శత్రుసైన్యాలపై విరగబడి యుద్ధం సాగించాడు.

వీరమూర్తియై రంగారాయుడు
విజృంభించాడు ||వి||
గజ గజలాడిరి శత్రువులాతని
కత్తి చూడగానె ||వి||
ఒక్కవేటులో పది శిరమ్ములే
ముక్కలైనవండీ ||వి||
రక్తపుటేరులె పారసాగెను
రాజవీధులందు ||వి||
ఫ్రెంచివారల గుర్రాలన్ని
పీనుగులయ్యాయి ||వి||
మత్తగజాలే ఒక్క దెబ్బతో
మరణ మందినాయి ||వి||



క్షేంచివారికి గుండెలప్పుడు
పీచుపీచు మనియె ||వి||
వెంటనే వారలు మందుగుండును
విని యోగించారు ||వి||
వెలమపేరులా మంటనుచిక్కి-
విడిచిరి ప్రాణాలు ||వి||
రంగారావు మాత్రమింకనూ
రణముచేయసాగె ||వి||
తుచ్ఛబుద్ధితో శత్రువులంతట
తుపాకి పేల్చాసి ||వి||
పేగులన్నియు బయటపడ్డవి
రంగారాయునకు ||వి||
ఇంకావారిచే మరణించాలని
యెంచి రంగరావు ||వి||
కత్తితోడుత రొమ్ము పొడుచుకుని
కన్నులు మూశాడు ||వి||

హాస్యం : ఆఖరుకు ఆయనకూడా అలా అస్తమించాడన్నమాట. సరే. తర్వాత కథ యేమిటిరా ?

కథ : యెక్కడకో పారిపోయిన బుస్సీ, విజయరామరాజుగార్లు రంగారాయుడు చనిపోయాడన్న సంగతి



తెలియగానే వచ్చారు. వారిద్దరూ రంగారాయుడిని చూసే నిమిత్తం ఆయన కళేబరం దగ్గరకురాగానే విజయరామరాజుకు యింకా ఆయన బ్రతికేవున్నాడేమోనని భయంవేసింది. ముందు దూరంనుంచి యీటెతో పొడిచి చూసి చనిపోయాడని నిర్ధారణ చేసుకున్నాడు. బుస్సీ రంగారాయుడిని చూడగానే తను చేసిన ఘోరానికి యెంతో విలపించాడు. కులద్రోహి, ఛండాలుడు, క్రూరుడూ అయిన విజయరామ రాజువల్ల తానింత అక్రమంచేయవలసి వచ్చిందని పశ్చాత్తాప పడ్డాడు. రంగారాయుడి శవానికి దహన సంస్కారాలు చేయించాడు. అటుపిమ్మట అతడు బొబ్బిలి యావత్తూ కలయ చూశాడు. యెక్కడచూసినా పీనుగులపెంటలే. శవాలగుట్టలే యేయింట్లో చూసినా మృతకళేబరాలే. చెరువులన్నీ శవాలతో నిండిపోయాయి. వీధులంట రక్తం కాలవలుగా ప్రవహిస్తోంది. స్త్రీలు, పిల్లలూ, వృద్ధులూ అన్న వివక్షత లేకుండా యావన్మంది కళేబరాలనూ చూసేసరికి బుస్సీగుండె చెరువైపోయింది. సరే. జరిగిందేదో జరిగిపోయింది. ఇక మర్నాడు వుదయం బొబ్బిలిలో విజయరామరాజుకు పట్టం కట్టాలని నిర్ణయించబడింది. ఇదియిలావుండగా.

రాజారమునకు వెంకటలక్ష్మి
రయమున వెళ్లింది ॥వి॥

చేతిలో బిడ్డను పాపారాయుడి
చేతిలో పెట్టింది ||వి||
ఆ సంఘటనకు పాపారాయుడు
అచ్చెరువందాడు ||వి||
యేమిటిదంతా? అంటూ బొబ్బిలి
క్షేమమె అడిగాడు ||వి||
జరిగినదంతా వెంకటలక్ష్మి
శెలవిచ్చినదండీ ||వి||
అదివినగానే పాపారాయుడి
హృదయం మండింది ||వి||
తాండ్రసింహము తోకత్రొక్కిన
త్రాచువలెను లేచి ||వి||
శత్రురాజునే హతమార్చుటకు
శపథం పట్టాడు ||వి||

కథ : పాపారాయుడు యిలా శపథంపట్టి తాను వచ్చేవరకూ బాలుడైన వెంకట్రాయుని జాగ్రత్తగా చూడమని అక్కడున్న పరివారాన్నీ, వెంకటలక్ష్మినీ హెచ్చరించి ముగ్గురు వీరుల్నికూడా తీసుకుని బయలు దేరాడు. బొబ్బిలి చేరగానే అతడు శవాల పుట్టలన్నిటినీ చూసి పరితపించాడు. కోటలోకికూడా వెళ్లి అక్కడున్న

మల్లమదేవి శిరస్సును దహన పరచాడు. తర్వాత అతడు తోటివారితో ఒక ఉపాయం ఆలోచించాడు. ఆ ప్రకారంగా ముగ్గురూ తూర్పుసీమరాజుల వేషంవేసుకున్నారు. పాపా రాయుడు విజయరామరాజుయొక్క అన్నకొడుకైన ఆనంద రాజు వ్రాసినట్లుగా విజయరామరాజు పేర ఒకవుత్తరం సృష్టించాడు. అందులో యీ ముగ్గురికీ నౌఖరీ యిమ్మని సిఫార్సు చేసినట్లు వున్నది. ఆ జాబుతో ముగ్గురూ సాయంత్రం సమయాన విజయరామరాజువద్దకు వెళ్లి జాబుచూపించారు. రాజు అది చూసుకుని మర్నాడువుదయం అవసరమైన ఏర్పాట్లు చేయిస్తాననీ చెప్పి ఆ రాత్రికి వారికి భోజనానికి కావలసిన వస్తువులు యిప్పించాడు. వారు బయటకువెళ్లి ఆ వస్తువులు యెగరజల్లి అంతవరకూ అలసిపోయి వుండడం వల్ల నిద్రపోయారు. అంతట :

పాపారావుకు నిద్దురలోన తందాన తందాని తందన
మల్లమదేవి కనిపించింది ॥తం॥
జరిగినదంతా వివరించింది ॥తం॥
రాజుకు రేపే పట్టమన్నది ॥తం॥
యిప్పుడె వెళ్లి పొడవమన్నది ॥తం॥

కథ : కలలో మల్లమదేవి యిలా పలికేసరికి పాపా రాయుడు చటుక్కున లేచి తోటివారిద్దర్నీ లేపి విజయరామ

రాజున్న డేరావద్దకు వెళ్లారు. అక్కడగస్తీ తిరుగుతున్న ంత్రిలోతులిని ఒక్కదెబ్బలో హతమార్చి ముగ్గురూ లోపల ప్రవేశించారు. రాజు గాఢంగా నిద్రపోతున్నాడు. అప్పుడు :

తాండ్ర పాపయ రామరాజును
తట్టిలేపినాడు ||వి||
నిద్దుర లేచి రాజాతనితో
నీవెవరన్నాడు ||వి||
అంతట చెప్పెను పాపారాయుడు
ఆగ్రహమ్ముతోడ ||వి||
దొంగబాటనే కోటజొచ్చిన
దుర్మార్గా వినరా ||వి||
బొబ్బిలికోటను క్షణములోపల
దెబ్బదీతు నన్న ||వి||
నీ ప్రాణాలను తీయ వచ్చిన
పాపారాయుడిని ||వి||
నీగుండెలపై కుంపటి లాగున
నేను బ్రతికియుంటి ||వి||
బొబ్బిలి దొరలు యెప్పటికైనా
బెబ్బులులే నోరి ||వి||
తాండ్ర పాపయ కత్తికి నీబలి
తథ్యమింక నేడు ||వి||



అంటూ బాకును చేత బుచ్చుకు
ఆక్షణమ్ములోనె ||వి||
రాజురొమ్మున పొడిచెను పాపా
రాయు డాగ్రహాన ||వి||
బొబ్బిలిపులియె వచ్చిన దంటూ
బొబ్బలెట్టి అపుడు ||వి||
విడచినాడయా ప్రాణమ్ములను
విజయగామరాజు ||వి||

అంతా అయిన తర్వాత ఆఖరుదశలో విజయరామ రాజుకు జ్ఞానంవచ్చింది. పోతూపోతూ అతడేమను కున్నాడయ్యా.

పద్యం. "అకట రావువారలతోడ నాజియేల
యంచు నెందరో చెప్ప నాలించకుండ
రణము దలపెట్టి యీరీతి ప్రాణములను
బాయుచుంటిని తాండ్రపాపయునివలన.

హాస్యం : అద్భుతం. ఆఖరుకు బొబ్బిలి వీరుల పరువు నిలబెట్టాడురా పాపారాయుడు.

కథ : విజయరామరాజు చచ్చిపోతూ బొబ్బిలిపులి వచ్చిందన్న కేకవేసి మరీ పోయాడుగా! ఆ కేక వినగానే అటు బుస్సీ సైనికులూ, యిటు రాజుసైనికులూ గబగబవచ్చి



పడ్డారు. వారు వచ్చి చూసేసరికి యింకేముంది? తెల్లవారితే పట్టకట్టుకోవలసిన రాజుగారు ప్రయాణమై స్వర్గానికి వెళ్లి పోయారు. వెంటనే ఆ సైనికులు పాపారాయుడినీ అతని యిద్దరు అనుచరులినీ చంపడానికి తుపాకులు తీశారు. అప్పుడు పాపారాయుడు తన అనుచరులతో యిక యెవరూ మిగలని యీకోటలు మనకెందుకని చెప్పి ముందుగా తానే కత్తితో పొడుచుకుని ప్రాణాలు విడిచాడు. తక్కిన యిద్దరూకూడా పాపారాయుడి మార్గాన్నే అనుసరించి వీరస్వర్గం పొందారు. ఇంతలో యీ సంగతి యావత్తూ బుస్సీకి తెల్సింది. అతడు తక్షణంవచ్చి ముగ్గురి కళేబరాలనుచూసి వారి పౌరుషానికీ, బలపరాక్రమాలకూ, త్యాగబుద్ధికీ ఆశ్చర్య పోయాడు. స్వార్థపరుడైన విజయరామరాజువల్లనూ, కుటిలచిత్తుడైన హైదర్‌జంగ్ వల్లనూ తాను బొబ్బిలిదొరలకు తీరని ద్రోహంచేశానని అతడు మళ్లా మళ్లా విలపించాడు. తర్వాత అతడు రాజారంలోనున్న బొబ్బిలి వంశాంకురం వెంకట్రాయుడినీ, వెంకటలక్ష్మినీ మిగిలిన వారినీ బొబ్బిలికి రప్పించి వెంకట్రాయుడిని సింహాసనం అధిష్టింప చేశాడు. ఆ బాలుడు పెరిగి పెద్దవాడయ్యేవరకూ రాజ్యపాలనను నిర్వహించే భారాన్ని కంచుకి అనే బొబ్బిలివీరునకూ, వెంకట్రాయుని పెంచి పెద్దచేసే భారాన్ని వెంకటలక్ష్మికి

అప్పగించాడు. కొత్తపల్లి సీమనుంచి బొబ్బిలివరకూ గల భాగమంతనూ బొబ్బిలివారికే యిచ్చి వేస్తున్నాననీ యిక ముందు యే ఆపదలువచ్చినా తాము ఆదుకోనగలమనీకూడా చెప్పి బుస్సీదొర తన పరివారంతో వెళ్లిపోయాడు. వెంకట్రాయుడు పెరిగి పెద్దవాడై విద్యాబుద్ధులు నేర్చుకుని బొబ్బిలి సంస్థానాన్ని చక్కగా పరిపాలించాడు.

ఇదిరా వీరబొబ్బిలి కథ.

హాస్యం : బలే! పసందయిన కథరా. ఇంక పోదాం రండి.

జయము జయము మన తెలుగు తల్లికి
జయము దిగ్విజయము
జయము జయము మన వీరనారికి
జయము దిగ్విజయము

గమనిక : ఇందులో కొటేషన్లు గల పద్యాలు విజయ బొబ్బిలిలోనివి.

స మా ప్తం.

రాజేశ్వరి ప్రెస్, రాజమండ్రి—1956

ఆంధ్ర, ఆంగ్ల-దైనిక మాసపత్రికలు, ఆలిండియా
రేడియో వారి ప్రశంసల నందిన

## -: మహత్తర బాలసాహిత్యం :-

| | | |
|---|---|---|
| పిల్లల బొమ్మల భారతము | వేం॥పా | 1-8-0 |
| పిల్లల బొమ్మల రామాయణం | ,, | 1-8-0 |
| పిల్లల బొమ్మల భాగవతము | ,, | 1-8-0 |
| పిల్లల భారత వీరాంగనలు | ర॥కృ నీ॥శ్రీ | 1-8-0 |
| పిల్లల బొమ్మల భారతనారీమణులు | అ॥అన్న | 1-8-0 |
| పిల్లల బొమ్మల భారతవీరులు | ? .... | 1-8-0 |
| పిల్లల చారిత్రక వీరగాథలు | దు॥శే | 1-0-0 |
| పిల్లల కథలు | కా॥ల | 1-0-0 |
| పిల్లల హాస్యకథలు | కో॥సో | 1-0-0 |
| బొమ్మరిళ్లు (ఆటలు-పాటలు) | ,, | 0-8-0 |
| పిల్లల పాటలు | స్వామి & వేదుల | 1-0-0 |
| పిల్లల పురాణకథలు | వి॥సూ | 1-0-0 |
| అమ్మమ్మ కథలు | అ॥ల | 1-0-0 |
| తాతయ్య కథలు | ,, | 1-0-0 |
| బాలకాశీమజిలీ కథలు | కే॥కృ 1,2,3, భా 1కి | 1-0-0 |
| పిట్ట కథలు | అ॥వీ | 4-0-0 |
| హిందీకథలు | స॥రా | 3-0-0 |

( పోష్టు ఖర్చులు ప్రత్యేకం )

వలయువారు :

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్**

బాలసాహిత్య నికేతనం : : : రాజమండ్రి.

# నూతన
# బుఱ్ఱ కథలు

| | | | |
|---|---|---|---|
| బాపూజీ | 0–4 | అల్లూరి సీతారామరాజు | 0–6 |
| నెహ్రూ | 0–4 | [illegible] | 0–6 |
| గాంధీజీహత్య | 0–4 | శివాజీ | 0–6 |
| నేతాజీ–బోస్ | 0–4 | వీరాభిమన్యు | 0–6 |
| జైప్రకాశ్ నారాయణ్ | 0–4 | ఝాన్సీరాణి | 0–6 |
| డాక్టర్ కోట్నీస్ | 0–4 | పొట్టిశ్రీరాములు | 0–4 |
| హిందూస్థాన్ స్ట్రైక్ | 0–4 | ఆంధ్రకేసరి ప్రకాశం | 0–6 |
| రజాకార్ల దుండగాలు | 0–4 | శ్రీకృష్ణరాయబారం | 0–6 |
| రాజాజీ | 0–4 | కురుక్షేత్రం | 0–6 |
| కొల్లేటిరైతు | 0–4 | విద్యార్థి | 0–4 |
| నిజాంపై పోలీస్ చర్య | 0–4 | కష్టజీవి | 0–4 |
| జమీన్‌రైతు | 0–4 | భగవద్గీత | 0–8 |
| కాంగ్రెస్ విజయం | 0–4 | పల్నాటియుద్ధం | 0–6 |
| సర్దార్ పటేల్ | 0–4 | వీరబొబ్బిలి | 0–6 |

● అడ్వాన్స్ లేని ఆర్డర్ అంగీకరింపబడదు. ●

దొరుకుచోటు

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్**

**సంస్కృతాంధ్ర బుక్‌డిపో (స్థా.1882) రాజమండ్రి.**

రాజేశ్వరి ప్రెస్, రాజమండ్రి.